కృష్ణారావు, బాలకవి

విలువిద్య

కాకినాడ, 1924.

Record no. 26

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

---

## Bibliographic Record Target

కృష్ణారావు, బాలకవి
విలువిద్య / గ్రంథకర్త బాలకవి కృష్ణారావు. - 1. కూర్పు. - కాకినాడ : కాకినాడముద్రాక్షరశాల, 1924.
14, 2 p. 20 cm.
Record no. 26

Kṛṣṇārāvu, Bālakavi
Viluvidya / granthakarta Bālakavi Kṛṣṇārāvu. - 1. kūrpu. - Kākināḍa : Kākināḍamudrākṣaraśāla, 1924.
14, 2 p. 20 cm.
Record no. 26

---

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB        Date filming began:

# విలువిద్య

గ్రంథకర్త.

బాలకవి కృష్ణారావు.

ప్రకాశకుఁడు,

కొండపల్లి వీరవెంకయ్య

బుక్కుసెల్లరు, రాజమండ్రి.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కోటుమర్తి చినరఘుపతిరావుగారిచే,

కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

కాకినాడ.

1924.

 [వెల 0-3-0

# ప్రమదామనోహరము

శైలి మృదుమధురము ! నవరసభరితము ! !

ఇది "శ్రీయుత అయినాపురపు సోమేశ్వరరావుగారిచే" రచియింపఁబడిన 7 అంకముల నూతననాటకము. ఈనాటకము బలుమారు బలువురిచే ప్రదర్శింపఁబడి వన్నెకెక్కియున్నది. ఇందు పుష్పకేతు, విజయసేనుని ప్రతిజ్ఞావాక్యములు వినిన భయానక రసంబును, వీరిరువురకును తగవు లేకుండ జేయుటకై విక్రమార్కుని నీతిబోధయు, చదివియానందింపవలసినదే గాని వర్ణించుటవలన లాభములేదు. కథానాయిక యగు "ప్రమద" సమయానుగుణ్యముగా జూపించు శోక, ధైర్య స్థైర్యము లొక్కమారు చదివిజూచిన "సెబాస్" అని యనకుండ నెవ్వరైన నుండగలరా? చంద్రకేతుని సాహసౌదార్యములు గాంచి భళీ యనవలసినదే విజయసేనుని ప్రతిజ్ఞానిర్వహణము గాంచి శిరఃకంపన మొనరింపవలసినదే. పుష్పకేతుని దుష్ప్రవర్తనఁ గాంచి ఛీ ఛీ యనక తీరదు. వేయేల నాటకము గాంచినచో మా వ్రాసినదాని యందలి యాదార్థ్యము మీకే బోధపడును. ద్వితీయముద్రణ యిప్పుడే వెలువడినది. త్వరపడకున్నచో ప్రతులు లభింపవు.

వెల రు 0—10—0.

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్ సెల్లరు,

ఇన్నీసుపేట, రాజమండ్రి.

శ్రీ

# విలువిద్య.

(ప్రథమభాగము)

గ్రంథకర్త.

అపరవిశ్వామిత్ర, అభినవద్రోణ, కలియుగార్జున,
శరవిద్యానిపుణ, సువర్ణఘంటాప్రముఖ బిరుదాంకితులగు

## బాలకవి, కృష్ణారావు.



సోల్ యేజెంటు

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్ సెల్లరు, రాజమండ్రి.

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1924.

 [వెల రు 0—3—0.



సువర్ణఘంట మీ కేలగట్టుకొంటిరని యొకరు ప్రశ్నించినందుల కివ్వబడిన ప్రత్యుత్తర పద్యములు.

ఉ. రెండవసవ్యసాచివని । చేడులుమెచ్చి సువర్ణఘంటికన్
పొందగనీవె యర్హుడవు । భూమినొరుల్ గన లేరటంచు, నా
యందు ముదంబుతోడ, కర । మందునగట్టిరి; వైరికోటి, కో
దండశరమ్ములన్ యెదుట । దాల్చిన జేయనె శృంగభంగమున్.

సీ. విలువిద్య నెవ్వారు । విఖ్యాతిగాంచిరో
జెప్పుమా యనగంట । యొప్పుకొనును
జగతిఁ బేర్వడ్డిన మీ । దగు నామమేదన

కలియుగార్జునుడని । గంటబల్కు
జననమొందినభూమి । వినగ ప్రార్థించిన
* శేకూరనుచు దెల్పు । చిన్నిగంట
శస్త్రాస్త్రపాండిత్య । చర్చకు రమ్మన
ఖంగుఖంగని గంట । చెంగలించు

గీ. ధరణికార్ముక వేద వి । ధంబెరింగి
మేటి విలుకాండ్రి గోటను । మీటుగంట
ఇట్టిముద్దుల బంగారు । ఘట్టిగంట
గట్టి విలుబట్టి జయభేరి । గొట్టినాడ

ఇట్లు,
గ్రంథకర్త.

* శేకూరు. ఇది గుంటూరుమండలములోనిది.

# పీఠిక.

విల్లమ్ము లెట్లుండునో యెఱుంగని, నిక్కాలమున కొందరు పటాటోపమునకు బంగారుపతకములు స్వయముగా నిర్మించుకొని కోటుపై సింగారించి కులుకుట యెగాక భీష్మద్రోణార్జున బిరుదాంకితుల మనియు నవయుగార్జునులమనియు నస్త్రగురువులమనియు నింకేమేమో యనియు వెఱ్ఱివ్రాతలు వ్రాసుకొని పత్రికలు జెరపుచు నవ్వులపాలగుచున్నారను సత్యము లోకమెఱింగియుండుటచే, అట్టివారిని తగదని హెచ్చరిక జేయుటకున్నూ ధనుర్విద్యాప్రవీణులయొద్ద శిశ్రూష జేసి విద్యగ్రహించి కీర్తిగణింపుమరను ముఖ్యోద్దేశముతో యున్నూ నీ విలువిద్యబోధిని ప్రథమపాఠపుస్తకముగా వెలువరింప సాహసించితిని. నేడు మనభారతఖండమున నత్యద్భుత యపూర్వ మహామంత్రి ప్రయోగోపసంహార ధనుర్విద్య యడుగంటిపోవుటచే మరల మొలకలెత్త జేయుట కడుంగడు ప్రయాసమని పాఠకు లెఱింగినవిషయమగుటచే విస్తరించి వ్రాయనైతిని శరవిద్యనుగురించిన వ్రాతప్రతులుగాని ముద్రితగ్రంథములుగాని యున్నను లభింపకపోవుటచే స్వానుభవమువల్లను పండితమైత్రిచేతను యిది మొదలిడితిని. రెండు మూడు పాఠపుస్తకములు మాసమున కొక్కొక్కటి చొప్పున వెలువడును, దోసములున్న యెడల పాఠకులు తెలియబరుపప్రార్థితులు.

ఇట్లు,
గ్రంథకర్త.



# ధనుర్విద్యాపరిదర్శనము.



వెనుముందుయున్న సప్తసాలముల నొక్కొక్కశరముచే ఒకే కాలమున కరపాదములతో నరుకబడుట ఇక్కాలమునగాని పూర్వము గాని ఇదియెవ్వరిచేతను జేయబడియుండలేదు. మూడుసంవత్సరముల పైకాలముక్రిందట నాచే ప్రథమమున కనిపెట్టబడినది. ఇప్పుడు నాదగ్గర నభ్యసించినవారును నేచేయునపుడు చూచినవారును పైవిద్య జేయ మొదలిడిరిగాని గురుద్రోహులు కొందరు తమరే కనుగొనినటుల జెప్పు చుండిరని వినుటచే నింతగా వ్రాయవలసివచ్చినది. నేచేయుపనులన్నియు నిందువ్రాయు టనవసరమగుటచే యిప్పుడు వ్రాయుటమానితిని. "పాశుపదాస్త్రం" ఇదిపూర్వము శివునిచే అర్జునుడుగ్రహించెను. ఈమహాస్త్రము కోరువారు నాదగ్గర నుపదేశము పొందవలెను. నాగాస్త్రము మొదలగు మహామంత్రములు సంపాదింపగలిగినశక్తి యనుగ్రహించిన ఆభగవంతుని సదా ప్రార్థింపుచున్నవాడ.

గ్రంథకర్త.






# విలువిద్యబోధిని.



ఆ. వె. పండువెదురుదెచ్చి । రెండుగా జీల్చియు
నొక్క భాగమంది । జక్క జేసి
మూరత్రోడ నాల్గు । మూరలు గొలచిన
విల్లుయంద్రు దీని । విశ్వమందు

తా॥ వెదురుపొదలలో మధ్యభాగముననుండి గట్టివరుసగల దియు పండువర్ణములోజేరి మృదువైనదియునగు కర్రనుదెచ్చి నాలుగు మూరల పరిమాణముయుండునటుల విల్లాకారముగా చక్కజేసి యుప యోగింపవలయును.

తే. గీ. జానచువ్వలు లేకున్న । ఝూరిపూచ
లున్న శ్రేష్ఠమ్ము గాకల । సన్న వెదురు
దెచ్చి నీటుగ జేయుము । కచ్చితముగ
రెండుమూరల పొడవుగ । నుండ శరము.

జానపుల్లలుగాని "ఝూరిపూచలు" గాని వెదురులో శ్రేష్ట ము లేక వెదురుజువ్వలు గాని దెప్పించి వంకరలేకుండునటుల రెండు మూరల నిడివిగల బాణములు జేయవలెను.

ఆ. వె. కాలమహిమచేత । "గాండివ" మిప్పుడు
నరుని నుసటివెత్తు । నాణ్యమనిరి

బద్దలోనసగము । బాణమ్ము సుఖముగ
లెక్కయిపుడు మనకు । నిక్కువముగ.

ఇక్కాలమునకు తగునటుల ప్రమాణమునకు నొసటిమెత్తుగల సింగాణియు, దానిలోసగము కొలతగలిగిన, అమ్మున్నా యుండుట మేలని పండితుల యభిప్రాయమైయున్నది.

ఆ. వె. గాండివ మనరాదు । కణుపులు జెక్కిన
పెరుసుయున్న కొలత । హెచ్చయున్న
తక్కువైన, దాని । దాల్పరు కార్ముక
వేదులెపుడు వసుధ । భేదమెరిగి.

బద్దయొక్క పైభాగమున కణుపులుజెక్కినను మృదువైనది గాకుండినను హెచ్చుతగ్గులుగాయున్నను ధనుర్విద్యాప్రవీణులు హస్తమున దాల్పరు.

కం. ఆలీఢము సమపద ప్ర
త్యాలీఢము మండలంబు । లైదు విశాఖం
బాలమున నెరిగియుండిన
మేలగు విలుకాడటండ్రు । మేటిధనుష్కుల్

ఆలీఢము సమపదము, ప్రత్యాలీఢము మండలము, విశాఖము నీయైదు విలుకాని నిలుకడల పేర్లు—

ఆలీఢము—కుడికాలు ముందరికిజాచి నిలచుట.

ప్రత్యాలీఢము—ఎడమపాదము ముందరికిజాచి నిలచుట.

సమపదము—రెండుపాదములు సమముగాయుంచి నిలచుట.

విశాఖము—రెండుపాదములు సమము జానెడుయెడముంచి నిలచుట.

మండలము—రెండుపాదములు గుండ్రముగాయుంచి నిలచుట.

ఈలక్షణములు యెరుగని నరుడు కార్ముకముబూనిన యెడల కోతికి టెంకాయ దొరకినచందముగా నుండును.



తే. గీ. ధన్వి ధానుష్క యస్త్రి యీ । ధరణిలోన
విను, ధనుర్ధరుడు, నిషంగి । యనగదనరు
ఘన ధనుష్మాను డనునారు । గతులగాంచి
విల్లుబట్టిన జయమౌను । వెరపులేక.

ధన్వి, ధానుష్క, అస్త్రి, ధనుర్ధరుడు, నిషంగి, ధనుష్మాన్, ఈఆరువిలుకానికిపేర్లు.

క. ఆకర్ణాంతము లాగుచు
ప్రకటముగ వింటిమౌర్వి । పండితవర్యుల్
నీకిల శుభములనిత్తురు
లేకున్నను సభలయందు । లేలెమ్మనరే.

శరప్రయోగము చేయునపుడు వింటియొక్కనారి చెవివరకు బట్టి విడువవలయును లేనియెడల పండితులు హేళనచేయుదురు.

తే. గీ. వైరివీరులపై వేయు । బాణసమితి
నెడమపాదము ముంజాచి । విడువవలయు
కర్ణపర్యంతమునుబట్టి । గాకయున్న
దూరమరుగదు, లక్ష్యంబు । దొలగిపోవు

ఒకవస్తువును భేదించునపుడు నారి యాకర్ణపర్యంతములాగి బాణము వేయనియెడల దూరమరుగక పోవుటయేగాక గురితప్పిపోవును.

ఆ. వె. వింటినుండిములికి । విడువగ నామౌర్వి
వడిగ కరమునంటి । బాధజేయు
గాన మోసమెరిగి । గలియగ ముంజేత
దాల్పు చర్మమొకటి । దలపువిడక.

ఒక్కొక్కసమయమునందు గాండివమునుండి బాణమువిడుచగా నావేగమునకు నారి యెడమ ముంజేతికి దాకి బాధజేయునుగాన ముంజేతిచుట్టును చర్మము ధరించవలెను.

క. "కుడికాలు జాచి వెనుకకు,"
నడుమును తగుసరణి వంచి । నారికి శరమున్
వడిబెట్టి మున్ను రాముడు
విడువగ ధరగూలెసప్త । వృక్షములపుడున్.

శ్రీరామచంద్రుడు ఎడమ పాదముముంజాచి (అనగా ప్రత్యాలీఢము) సప్తసాలములను భేదించెను.

తే. గీ. మోముపెడద్రిప్పి శబ్దంబు । మోపునటుల
జెవులువిననిల్పి, నితరంబు । జేరనీక
దశరథేశ్వరుడేయగ । దవిలెతూపు
విప్రబాలకు గుండియల్ । వీడిపోవ.

శబ్దమువచ్చు దిశకుజెవులునిల్పి బాగుగానాలకించి బాణము వేయుగా, కొలనులో నీరు నింపుకొనుచున్న బ్రాహ్మణబాలకుని జీవములుగొనెను. (దీనినే శబ్దవేదియందురు)

తే. గీ. ఉదకమొక పళ్లెరమ్మున । నునిచి మత్స్య
యంత్రమునుజూచి గూల్చె నా । యర్జునుండు
కొనువంచియు కోలదిగ । గౌరవులకు
గుండెదల్లడమొందెను । గూల్చుసరణి.

ఒక పళ్లెమునిండుగ నీరుపోసి పైనకట్టబడిన చేపాకారమును నీటిలోజూచుచు నొక్కకోలచే మత్స్యమును ధరపైబడునటుల నర్జునుడుజేసెను. (ఇది మత్స్యయంత్ర విధానము.)

తే. గీ. చలనభంగము గావించు । జాపమెపుడు
పదియుమూడును పిడియలై । బరగుచుండు
గురినిజూచెడి సింగాణి । కోలతసరిగ
పదియునాలుగు పిడియలు । బట్టవలయు.



కదలుచున్న వస్తువునుగొట్టుటకు శరాసనము పదమూడు పిడియలుంచవలెను. గురినిగొట్టెడి ధనస్సు పదునాలుగు పిడియలుంచవలెను.

తే. గీ. శరము దూరముబరపెడి । శార్ఙ్గములను
పదియునైదు పిడియలైన । వన్నెకెక్క
నాలమందున విఖ్యాతి । నందువిల్లు
పదియునారు పిడియలుంచ । వలయుసుమ్ము.

దూరముపోవునటులజేయు బాణమునకు కోదణ్డము పదునైదు పిడియలుండునటుల జేయవలెను. పదునారు పిడియల గాండివము యుద్ధములో జయమిచ్చును.

గీ. తరకసంబున, నూరైన । శరములుంచి
జనుము నెచ్చోటికైనను । జాపమూని
లేక నేపనిజేసిన । మోకరించి
కీడుగల్గును, నమ్ముమే । వాడనైన.

అమ్ములపొదిలో నూరుబాణములైనను యుంచి విలువిద్యాప్రదర్శనము జేయుటమంచిది.

గీ. శరమునకు నెమలినెరులు । జక్కగాను
గూర్చి విడచిన దూరంబు । జేర్చునొకటి
గాలి, నెదిరించిజనుటయు, । కదనమందు
గుఱుతువెట్టిన దానినే । గూల్చుటయును,
జరుగు నిశ్చయమిది శాస్త్ర । సరణిధరణి.

బాణముపట్టుకొనుచోట రెండువైపుల నెమలిపింఛములు (నెమలికన్నులు) గట్టివిడచినయెడల దూరమరుగజేయుటయేగాక గాలికెదురేగి గుఱుతునకొట్టును. (కొందరుగద్దరెక్కలు మొదలగు అనేకవిధములగు పక్షినెరులను గట్టుదురు.)

ఆ. వె. బొటనవ్రేలఁబట్టి । పోవఁగ బాణంబు
విడువవనుచు మున్ను । వీరుఁడైన
యేకలవ్యుఁడొసఁగె । నింపారఁగట్నంబు
గురువరేణ్యుఁడైన । కుంభజునకు.

పూర్వ మేకలవ్యుఁడను యెఱుకలవాఁడు శబ్దవేధిచేసినటుల నర్జునునివలన ద్రోణాచార్యులు విన్నవాఁడై గురుకట్నముక్రింద బొటనవ్రేలునిమ్మని యెఱుకవానిఁగోరెను. గురుశుశ్రూష జేయకపోయినను, మదిని స్మరించితిఁగదా యని యెఱుకవాఁడు గురుకోర్కెదీర్చెను.

ఆ. వె. బొటనవ్రేలువిడచి । భూరికాండంబుల
విడువ రెండు మూఁడు । వ్రేళ్ళతోడ
సరిగఁదొలుతకన్న । నతివేగమునుజూపి
యడవిదొరలమదికి । నక్కజముగ.

ఆనాటినుండియు నంగుష్ఠముతో శరముఁబట్టక వరుసగా రెండవ, మూఁడవ, వ్రేళ్ళతో బాణములు సంధించి వేయఁగా పూర్వముకంటె విస్తారదూరమేఁగి అడవిదొరలకు సంతసముకలిగించెను.

ఆ. వె. శబ్దవేధిచేయ । శరముఁబొటనవ్రేల
బట్టివదలకున్న । ప్రాణహాని
కల్గునేరికైన; । "కాంతారవాసులు
శాపవశముచేత । నల్పరదియు."

శబ్దవేధిచేయునపుడు బొటనవ్రేలితో బాణము వేయవలెను. లేనియెడల నపాయము సంభవించుటయేగాక నిందకు పాత్రులగుదురు. అడవులనుండువారు మాత్రము శబ్దవేధిచేయుదురు.

గీ. గుఱుతునొకదాని గోడను । గుండ్రముగను
బెట్టి నడిభాగమున నమ్ము । గొట్టుచుండ



వలయు, పదికారు బాణముల్ । వసుధయందు
దగులఁజేసిన, గురిలోన । ధన్యతముఁడు.

గోడపైగాని, మఱొకచోఁగాని, గుండ్రని గుఱుతుపెట్టి దానిమధ్యభాగమున బాణముదగులునటుల మొదట నభ్యసింపవలెను. తుదకు పదిశరములేసినయెడ, వానినైనను గుర్తుపెట్టిన స్థలమున దగులునటుల నేర్చినలక్ష్యము నిలిచిన ట్లెఱుంగవలయును.

గీ. చలనమును జేసి దారంబు । శరముతోడ
గూల్పఁజేయుము; తదుపరి । గూర్చి రెండు
మూఁడు, నాలుగు, వరుసగా । మొనములర
నునుము నభ్యాస మొనరించి । గనుముకీర్తి.

లక్ష్యమునిలిచినతరువాత, దారమునూఁగుచుండునటుల జేసి బాణముచే గూల్పవలెను, (ఇది చలనభంగము గావించుట.) అభ్యసించిన కొలది, రెండు, మూఁడు, నాలుగు, దారములనూపుచు ఒక్కబాణముచే దునుమవలెను. (దారములు కదలుచున్నపుడు క్షణక్షణమునకు నొకదానిపై కొకటివచ్చి పోవుచుండును. అట్టిసమయముచూచి సంధించుట బాణము వేయవలెను.)

బాణముల పేర్లు.

కలికాముఖము, చక్రిముఖము, దంష్ట్రాముఖము, వజ్రముఖము, క్రౌంచముఖము, గజపాదముఖము, అర్ధచంద్రముఖము, సర్పముఖము, కుక్కురముఖము, ఘూకముఖము, సూచీముఖము, కుంతముఖము, మకరీముఖము, వరాటికాముఖ మాదిగల బాణములు పెక్కులుగలవు. రెండవ భాగములో బాణములయొక్క ప్రతిమలతో సహా వ్రాయబడును గనుక నిందువిస్తరించి వ్రాయనైతిని.

ఇందులోని కఠినపదములకు టీక కార్ముకము, శరాసనము, ధనస్సు, విల్లు, గాండీవము, చాపము, సింగాణి, శార్ఙ్గము, ఇవి వింటి బద్దకు పేర్లు,

కోల, అమ్ము, శరము తూపు, ములికి, ఇవి బాణముకు పేర్లు

నారి, మౌర్వి, వింటినరము పేర్లు

తరకసము. అమ్ములపొది పేరు

ఈ గ్రంథకర్తగారిచే రచియింపబడి అచ్చుకానున్న శిష్యనీతి భారతములోని కొన్ని పద్యములు.

మ. ధరదేశంబులకెల్ల రాణియని మాం । ధాతాది సత్యోన్నతుల్
పరిపాలించిన "హిందుదేశమున" నే । వర్ధిల్లితిన్ కృష్ణుడన్
శరవిద్యానిపుణుండ శాంతియుతుడన్ । స్వాతంత్ర్య ధీరుండ నీ
తరమా నన్నెదిరించ? లింగధర! నా । దాసుండవై యుండుమా.

ఉ. గెల్చెద నస్త్రవిద్య నిను । గేరడిజేసెద నాశుధారలో
గూల్చెద కుస్తినైన సరే? । గోరికయుండినరమ్ము? వచ్చినన్
చీల్చెదగద్దులేక? యిక బెద్దవు । దా, ద, ద, దశ్వరశ్వనన్
గెల్చెద నీవు నిశ్చయము । కీచురవంబున శంఖునూనుచున్.

గీ. పుట్టుకతోడనె శౌర్యంబు । పొరలుగాని
నడుమవచ్చునె? కేసరి । నడతగాంచి
కుక్క, గాడిద, నక్కలు । గొప్పకొరకు
గూతలిడఁగాక; దెలియరే । జాతిస్వరము.

ఆ. వె. విధవమగు వాసంగు । విడియంబు సుఖమును
శంఖు దాల్చుచేతి । శరము సొగసు
వాయజాల నవియె । బ్రహ్మదేవుడు మున్ను
కానిపనులు యగుట । గఠనమునను.



గీ. అంటుమామిడి ఫలముల । యధికరుచియు
సరసుడెరుగును వనముల । సంచరించు
మన్నె కెరుకౌన? "కృష్ణుని" । వన్నెపలుకు
మోహనాకార కామినుల్ । ముద్దుముండ్రు
గాని; శంఖుడు బలికించు । కఠినచిత్తు
డెట్టు కనుగొను; భమ్మని । మిట్టిపడుచు.

మ. అనలజ్వాలలతోడ "పాశుపత" మా । హాకారముల్ సల్పుచున్
వెనువెంటన్ బడు; నెందుడాగిన మదిన్ । జేజారి ప్రార్థించినన్
వినకన్ పాపము జ్ఞప్తికిన్ దగులగన్ । వేధించునో శిష్యుడా
వినుమా "కృష్ణుని" తోడి పోరుతగునా? । బింకాలు చాలింపుమా.

ఉ. వాదనజేయబోకు నగు । బాటగు చెప్పెద మెమ్మెమన్న నీ
కేదియొ మున్ను దేవుడొక । గేకలువేసెడి వృత్తి బన్నె యా
సాధనవీడి యన్యుల సు । శక్తినిగాంచియు చింతనొందుటల్
బాధయెకాని యేర్పడదు । పండితభావము మూర్ఖచిత్తుకున్.

మ. నడివీధిన్ "గజ" మేగుచున్న యెడ నా । నారీతులన్ గూయవా
జెడుకుక్కల్ మదమెక్కి మిక్కుటముగా । జెప్పుల్ దినన్ నేర్చి నీ
నడకన్ జూడగ నంతకన్న నిల హీ । నం బయ్యె పామండుడా
జెడుమాటల్ యికవీడి నన్నుగని నీ । చిత్తంబులో గొల్వుమా.

చ. గడచినదానికిన్ వగచి । గన్నులనీరును గార్చబోకు, నీ
నడవడి యిట్లుజేసె నిక । నన్నని తప్పుక్షమింప వేడినన్
దడయక పాత్రముల్ నిపుడె । దాచెద, లేదన జించివైతు, నీ
ముడివడు మోముజూచి నిటు । బూనితి రూకలఖర్చు నెంచకన్.

ఉ. సంకురమయ్యె బిడుగకు । శంకర, భమ్మని శంఖునూదినన్
చంకలకిందిజోలెలకు । జాలగబియ్యము వచ్చు నూక లా.

టంకము లేక పెట్టుమరు । 'టారట డాఘడ' యంచు మొద్దనో
రొంకరి కూతలేబలుక । నష్టాని నవ్విరి వూచలేయగన్.

ఉ. మోటుడవీవు బల్కినను । బొంకుదు గొంతుక లింగమంత్రి నా
మాటలలో కీర్తినిచ్చు ఘన । మంత్రములౌ దివిజాళిమెచ్చి నీ
సాటియు లేరటంచు త్రి భువి । సద్గతిగాంచగ దారిచూసాను బా
హాటముగా ప్రమోదమున । హాయని మెచ్చరె ? కామినీమణుల్.

బాణవిద్య చేయుదునని ప్రగల్భములు బల్కి నీరీతిగా వచించి
నందుకు "శృంగభంగము" జరిగెను. ఒకరికి.

సీ. మత్స్యయంత్రము గూల్చె । మావిరాట్రాజన
చప్పట్లు గొట్టిరి । సభికులంత
సప్తసాలంబులు । సరగున భేదించె
కేకయురాజన । గేకలిడిరి
శబ్దవేధిత్వము । సాళ్వభూపతి యన
నోరు విప్పకుమని । నుడివినారు
గురునకు మ్రొక్కెను । శరము లేసియు మును
కీచక నృపుడన । ఛీచియనిరి

గీ. అహహ యేమందు విలువిద్య । యందమనుచు
పతకె మొక్కటి జేయించి । పయిటమీద
గుండుసూదికి గ్రుచ్చెనే । కులుకుచుండ
శంఖునామము నీకేల । శరములనిరి.



# నాటకములు.

| | | | |
|---|---|---|---|
| గయోపాఖ్యానం చి॥ ల॥ | 0- 8 | సంగీత సావిత్రి | 0-12 |
| ప్రసన్న యాదవం | 0- 8 | ఉషాపరిణయం | 0- 8 |
| పారిజాతాపహరణం | 0- 8 | శ్రీరామ విజయం | 0- 8 |
| చతురచంద్రహాస | 0- 8 | శ్రీరామ జననం | 0- 8 |
| స్వప్న వాసవదత్త | 0- 6 | శ్రీరామ వుద్యోగం | 0- 8 |
| పార్వతీ పరిణయం | 0- 6 | శ్రీరామ ప్రవాసం | 0- 8 |
| సంపూర్ణ రామాయణము గూ॥ కా॥ | 1- 4 | శ్రీరామ అశ్వమేధం | 0- 8 |
| సంపూర్ణ భారతం రా॥ నా॥ క॥ | 1- 4 | సారంగధర | 0-12 |
| సంపూర్ణోత్తర రామాయణం | 1- 4 | సంగీత శశిరేఖ | 0-12 |
| పాండవ విజయం | 1- 0 | ప్రహ్లాద | 0- 8 |
| [illegible]పాత్రి | 1- 0 | కలికాలచర్య | 0- 6 |
| ఆంధ్రపతాకం | 1- 0 | సామ్రాజ్యోద్దీయం | 0-10 |
| ద్రౌపదీవస్త్రాపహరణం | 1- 0 | విజయ బొబ్బిలి | 0-12 |
| సతీతులసి | 1- 0 | వైదర్భివిలాసం | 0-12 |
| అహల్యాశాప విమోచనం | 1- 4 | వేశ్యామధురం పా I | 1- 0 |
| కాంతామతి | 0-12 | డిటో II | 1- 0 |
| కనకతార దా॥ సీ॥ రా॥ | 0-12 | డిటో III | 0- 8 |
| శ్రీకృష్ణ తులాభారం | 0-12 | హనుమద్రామసంగ్రామం | 0-10 |
| పాండవాజ్ఞాతవాసం | 0-10 | సుశీల | 0-10 |
| జయంత జయపాలీయం | 0- 8 | సత్యహరిశ్చంద్ర చ॥ మా॥ శ॥ | 1- 0 |
| లంకాదహనం | 0-10 | భూలోకరంభ | 1- 0 |
| రసపుత్ర విజయం | 0-12 | చింతామణి | 1- 0 |
| పాదుకా పట్టాభిషేకం | 0-12 | గులోబకావలి | 1- 0 |
| పీష్వానారాయణరావు | 0-12 | కనకాంగ | 1- 0 |
| లోకాభిరామాయణం | 0- 6 | సంపూర్ణ భారతం | 1- 4 |
| కృష్ణలీల | 1- 0 | ప్రసన్న ముఖి | 1- 0 |
| లవకుశ | 1- 0 | సత్యహరిశ్చంద్రీయం బ॥ ల॥ కా॥ | 1- 4 |
| కృష్ణలీల అను దశావతారములు | 0-12 | సత్రాజితీయం | 0-14 |
| సంగీత ప్రహ్లాద సాంగ్సుగలవు | 0-12 | బుద్ధిమతీ విలాసం | 1- 4 |
| చంద్రకాంత | 0-10 | ఉత్తరరాఘవము | 1- 0 |
| మహారాష్ట్ర విజయం | 0-12 | అభిజ్ఞాన శాకుంతల వ॥ సు॥ | 1- 0 |
| సంగీత స్త్రీసాహసం | 0-12 | విక్రమోర్వశీయం | 0- 8 |

| | |
|---|---|
| చండకౌశిక | 0-10 |
| వేణీసంహారం | 1- 0 |
| ప్రభోత చంద్రోదయం | 1- 0 |
| శుకచింతామణి | 0- 5 |
| సతీస్మృతి | 0- 4 |
| పాదుకా పట్టాభిషేకం పా॥ ల॥ న॥ | 1- 4 |
| కంఠాభరణం | 1- 0 |
| రాధాకృష్ణ | 0-10 |
| సారంగధర | 0- 8 |
| ప్రచండ చాణిక్యా | 1- 0 |
| నర్మదా పురుకుత్సీయం | 0-12 |
| సాక్షి మొదటిభాగం | 2- 0 |
| డిటో రెండవభాగం | 2- 0 |
| డిటో మూడవభాగం | 1- 8 |
| డిటో నాల్గవభాగం | 1-12 |
| గులేబకావళి అ॥ సు॥ ర | 1- 0 |
| జయచంద్రచంద్రరేఖావిజయం | 0-10 |
| పసన్ బకావళి | 1- 0 |
| శ్రీకృష్ణవిలాసం యిందు 8 నాటకములు గలవు | 0-12 |
| రత్నమాల యిందు 9 నాటకములు గలవు | 0- 9 |
| గర్వభంగము | 0-10 |
| ఊర్వశీ శాపవిమోచనం | 1- 0 |
| పాండవ ప్రతిజ్ఞ | 0-10 |
| యాదవుల ప్రతిజ్ఞ | 0-12 |
| సుగుణమణి వ॥ బ | 0-10 |
| బొబ్బిలి యుద్ధనాటకము శ్రీ॥ కృ॥ | 1- 0 |
| కలభాషిని | 0-12 |

| | |
|---|---|
| కన్యకాపరమేశ్వరీవిలాసం తె॥ క॥స | 1- 0 |
| రంగారాయ కదన శమనాకారం | 1- 0 |
| హాస్యపు పాటలు త॥ జ॥ | 0- 6 |
| మహిళామనోరంజనీపాటలు గు॥కో | 0- 5 |
| వేడుక పెండ్లిపాటలు తే॥ తి | 0- 8 |
| భక్త రామదాసు కె॥ రా॥ శే | 1- 0 |
| పాంచాలీ మానసంరక్షణం | 1- 4 |
| సంగీత జగన్మోహిని పా॥ బు | 1- 0 |
| సంగీత పద్మిని | 0-10 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము పా॥ వెం | 1- 0 |
| రోహిణీ సుధాకర విజయం | 1- 0 |
| మాలతీ మధుకరం బ్ర॥ స్వా | 1- 0 |
| అధ్యాత్మ రామాయణకీర్తనలు | 0-10 |
| చమత్కార చంద్రిక మ॥ వెం శే | [illegible] |
| బాలవితంతు విలాపము | [illegible] |
| రామరావణా సంగ్రామము వ॥ య | 1- 0 |
| సీతాన్వేషణం | 1- 0 |
| సీతావిజయం | 0-11 |

### వైద్య గ్రంథములు.

| | |
|---|---|
| ఆయుర్వేద సారసంగ్రహము | 0-12 |
| సుఖరోగ చికిత్సా రత్నాకరము | 0-12 |
| శతలేహ పాకప్రకాశము | 0- 8 |
| పాణీయకల్పవల్లి | 0- 4 |
| ధన్వంతరవిజయము | 0-10 |
| నాడీపరిజ్ఞానము | 0- 6 |
| నాడి నక్షత్రమాల | 0- 4 |
| నేత్రదర్పణము | 0- 8 |

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్ సెల్లర్, రాజమండ్రి,

ఇన్నీస్ పేట.

# ప్రతాపసింహ.

[ఐదంకముల క్రొత్త నాటకము.]

ఇది కోటమర్తి చినరఘుపతిరావుగారిచే రచియింపబడినది. శైలి మృదుమధురము. ప్రదర్శనమున కనువగునటుల షేక్స్పియర్ మహాకవియొక్క "హామ్లెట్" అను కథ ననుసరించి వ్రాయబడి చక్కని ఫెదర్ వెయిటు కాగితముపై ముద్రింపబడుచున్నది. ముందే ఆర్డరులు పంపువారికి 0—12—0. లకు పంపబడును. ఇతరులకు సువర్ణ రు 1—0—0.

## సంగీత
# శ్రీకృష్ణరాయభారము

నూతనముగా వెలువడినది. నూతనముగా వెలువడినది.

"శ్రీకృష్ణరాయభార" మనుటతోడనే ప్రతి యాంధ్రునకును ఇందలికథ జ్ఞప్తికి వచ్చితీరును. ఈరాయభారమును బ్రహ్మశ్రీ చక్రవధానుల మాణిక్యశర్మ గారిచే నూతనముగా వ్రాయబడినది. పాత్రపోషణమున నేమి; పాత్రౌచిత్యమున నేమి? దీని కిదియే సాటి. ధర్మజుని యోర్పు, భీముని రౌద్రము, శ్రీకృష్ణుని యుక్తి ప్రయుక్తులు కర్ణాశ్వత్థామల తగవులాట, ధృతరాష్ట్రుని కృత్రిమాలోచన చదివి, విని, యానందింపవలయునే కాని యూరక వర్ణించుటవలన లాభము గానరాదు. ఒక్కమారు చదివిజూడుడు. కర్ణుని జన్మరహస్యమును శ్రీకృష్ణుడు, కుంతియు గూడ వాని కెఱింగించి పాండవులలోనికి రమ్మనమని బోధింప కర్ణుడు దెల్పిన ధర్మములు విని తీరవలయును.

వెల రు. 0—12—0

# మహానంది

భక్తిప్రధాననాటకరాజము, శివస్తోత్రము శ్రవణానందకరము. పద్యములు రసవంతములు. శైలిమృదుమధురము భావము అత్యాశ్చర్యము. చక్కని యాదర్శములు. ఈనాటకము నెందరో రచియించిరిగాని ప్రదర్శనార్థమై యెన్నియో నాటక సమాజముల వారు యీగ్రంథకర్త గారి నాటకమునే శ్లాఘించుచున్నారు. ఒకపరియాయము చదివిన తృప్తి తీరదు.

# సతీసంయుక్త

వేంకటపార్వతీశ్వర కవులలో నొకరగు, మ॥ బాలాంత్రపు వేంకటరావుగారి చేతను, దుర్గేశనందన, నవాబునందిని మొదలగు రసవంతముల నవలలను రచించిన చాగంటి శేషయ్యగారిచేతను వ్రాయఁబడిన నాటకము. హిందూదేశచరిత్ర సంబంధమగు నాటకము. హిందూ చక్రవర్తులలోఁ గడపటి ఢిల్లీచక్రవర్తియగు పృథ్వీరాజ సార్వభౌముని విక్రమవిహారములఁ దెల్పు నాటకము. దేశద్రోహియగు జయచంద్రుని పాపవర్తనమును బ్రకటించిన నాటకము. సతీమతల్లియు, వీరపత్నియు, విశ్వహిత చరిత్రయు నగు సంయుక్తాదేవి పవిత్రచరిత్రము రసోచితముగ నిందు వర్ణింపఁబడినది. దేశహితము గోరి సంయుక్తాదేవి తండ్రియగు జయచంద్రునకు వైరులతోఁ జేరవలదని చెప్పిన బుద్ధులును, రణరంగమున క్షతగాత్రయై పడి స్వదేశరక్షణమునకై నాథునకుఁ బంపిన మాటలును జదివినచో నెంతటి రాతిగుండెమైన నీరుగాకమానదు. వీరకరుణ రసములచే వెలయు నీ మహానాటక మైదంకములు గలది. ఆంధ్రదేశమునఁ బేరొందిన నటకులచే నెన్నియో తడవలఁ బ్రదర్శింపఁబడినది. దేశభక్తులందఱును జదువఁదగినది. చదివి యానందింపఁదగినది.

దీనివెల రు. 1—0—0

వలయువారు:— కొండపల్లి వీరవెంకయ్య, బుక్ సెల్లర్,
ఇన్నీసు పేట,
రాజమండ్రి.

